జైహింద్!　　　　　　　　　　　　జైహింద్!!

# విశ్వగీత




'యణాది" బహుకావ్యకర్త

ాతికవి, వైద్యశ్రీ

**డాక్టరు, పొందూరి సాంబమూర్తి.**

# అచ్చునకు సిద్ధముగానున్న పద్య కావ్యములు

త్వరలో

1. శ్రీ మదాంధ్రీ నిర్వచనోత్తమ సంపూర్ణ సాంబమూర్తి రామాయణము.

2. నవోదయ శ్రీ
(ఖండకావ్యములు)

3. స్వార్థపరుడు
(పద్యప్రబంధము)

4. శృంగారనిధి

మరికొన్ని —

... అచ్చుపడినవి ...

1. రైతుబాబు

2. కన్నీటిజల్లు

3. విశ్వగీత.

మరికొన్ని —

జైహింద్!   జైహింద్!

# విశ్వగీత




“ నిర్వచన రామాయణాది ” బహుకావ్యకర్త

బాలకవి, వైద్యశ్రీ

డాక్టరు, పొందూరి సాంబమూర్తి

# కృతజ్ఞత

కటికిచీకటిలో కారాడుచున్న నా కవితాకుమారికి కూపు రేఖలు దిద్ది నా "**రైతుబాబు**" యను తొలికావ్యమును ఆంధ్రలోకమునకు సమర్పించిన

నా ప్రియమిత్రులు, సహాధ్యాయులు,

ఆంధ్రశాసన సభా సభ్యులు,

*శ్రీ శ్రీ చింతలపాటి సీతారామచంద్రవరప్రసాదమూర్తిరాజు,*

*ఎమ్. ఎల్. ఏ. గార్కి.*

చిననిండ్రకొలను.

(పశ్చిమ గోదావరి జిల్లా.)

# అభినందన



ఒకనాఁడయాచితముగా ఆముదాలవలస ప్లాటుఫారమ్మీఁద కలసి, నా కోరికపై మా యింటికి దయచేసి నా కావ్యములను పరీక్షించి, తన యామోద ముద్రను వెలిబుచ్చి యీ **"విశ్వగీతము"** ఆంధ్రి పాఠకలోకానికి సమర్పించుటకు వెంటనే రూ. 316/- లొసంగిన వదాన్యులు, యువకుడు, విద్యాధికుడు **శ్రీ శ్రీ చిగిరిపల్లి సత్యనారాయణ గారికి** (బొడ్డేపల్లి, శ్రీకాకుళం జిల్లా) భగవంతు డాయురారోగ్యములు పుత్ర పౌత్రాభివృద్ధి నొసంగి సర్వదా కాపాడుగాక యని ప్రార్థించుచున్నాఁడను.



# నాకు తమతమ యథాశక్తి విరాళము లొసంగిన

# దాతల పేర్లు

—

శ్రీ కిల్లి అప్పన్నాయ్డుగారు, పురుషోత్తమపురం.

,, కిల్లి చిరంజీవరావుగారు, ,,

,, కిల్లి వెంకటసత్యనారాయణగారు ,,

,, మొజ్జాడ బసివినాయ్డుగారు ,,

,, కిల్లి జగన్నాధరావుగారు ,,

,, సమ్మినేని పాపారావుగారు, M. L. A. తొగరాం.

,, కుక్కుటాల నరసింగరావుగారు, ఆమదాలవలస.

బస్సుల ప్రొప్రైటరు.

,, సర్వేడిపార్టుమెంటు నెం. 9. (ఆమదాలవలసబ్రాంచి)

,, ఉప్పాడ అప్పారావుగారు, ఎం. ఏ.,

లెక్చరర్ గవర్నమెంటు కాలేజీ, శ్రికాకుళం.

,, రోణంకి ఆనందరావుగారు, ఎం. ఏ.,

లెక్చరర్ గవర్నమెంటు కాలేజీ, శ్రికాకుళం.

,, కణితి వేంకటజనార్ధనగారు. శ్రీకాకుళం.

బి. ఏ., బి. ఎల్., అడ్వకేట్.

,, దువ్వాడ ఎర్రిప్పచౌదరిగారు, ,,

బి. ఏ., బి. ఎల్., అడ్వకేట్.

శ్రీ అట్టాడ అప్పలనాయుడుగారు, శ్రీకాకుళం
బి. కామ్. సి., బి. ఎల్, అడ్వకేట్.

,, పైడి రామస్వామిగారు, బి. ఏ., పురుషోత్తమపురం.

,, గున్ను కృష్ణారావుగారు, బి. కామ్., ,,

,, హనుమంతు దీనబంధుగారు, బి. ఎస్. సి. బోలుభద్ర.

,, మెట్ట గురునాధరావుగారు, సుబ్రహ్మణ్యపురం.

,, బొడ్డేపల్లి లక్ష్మీనారాయణగారు, కొత్తపేట.

,, పాత్రుని చినబాబుగారు, ,,

,, సువ్వారు కృష్ణమూర్తిగారు, ,,

,, హనుమంతు కృష్ణారావుగారు, అల్లాడ.

,, సనపల కృష్ణమూర్తిగారు, కొర్లకోట.

,, ఆచంటి సూర్యనారాయణమూర్తిగారు, పొందూరు.

,, తేలుగుంట నారాయణశాస్త్రిగారు, ,,

,, గుడిశ రామకృష్ణారావుగారు, ,,

,, నాళం సూర్యనారాయణమూర్తిగారు, ,,

,, కల్లేపల్లి శివనారాయణగారు, ఆమదాలవలస.

,, ఆత్మకూరి బుచ్చిరాజుగారు, ,,

,, సువ్వారి అప్పారావుగారు ,,

(ది కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీ.)

| | | |
|---|---|---|
| శ్రీ | కుసుమంచి జానకీరామయ్యగారు, | ఆమదాలవలస. |
| ,, | వైశ్యరాజు సవరాజుగారు | ,, |
| ,, | వైశ్యరాజు నరసింహరాజుగారు | ,, |
| ,, | వెంకటేశ్వరన్‌గారు, (ప్రొప్రైటరు, దేవీవిలాస్.) | ,, |
| ,, | తమ్మన లక్ష్మణరావుగారు, | ,, |
| ,, | బొడ్డేపల్లి నరసింగరావుగారు, | కణుగులవలస. |
| ,, | బొడ్డేపల్లి పున్నయ్యగారు, | ,, |
| ,, | సీపాని సీతారాంగారు, | ,, |
| ,, | సువ్వారి అచ్చన్నాయ్డుగారు, | ,, |
| ,, | గుండ అసిరినాయ్డుగారు, | చింతాడ. |
| ,, | పొట్నూరి స్వామిబాబుగారు, | ఆమదాలవలస. |
| ,, | బొడ్డేపల్లి శ్యామసుందరరావుగారు, | అక్కులపేట. |

# ఉపోద్ఘాతము



'**విశ్వగీత**' యను నీ పద్యకావ్యమును వ్రాసినవారు శ్రీయుతులు డాక్టరు పొందూరి సాంబమూర్తిగారు.

నిజమైన కవిత్వమును రుచిచూపి 'రైతు బాబు' ను బ్రచురించి యాంధ్రుల కింతకుం బూర్వము వీరు పరిచితులైనవారే.

కొన్ని కావ్యముల కుపోద్ఘాతము లవసరము లేదు. కొన్నింటి కుపోద్ఘాతము లెంత విపులముగా నున్నను బ్రయోజనము లేదు. ఈ కావ్యము మొదటి జాతికిం జెందినది.

భారతముపై నెవరి యభిప్రాయమున్నది? భాగవతముపై నెవ్వరి తొలిపలుకు లున్నవి? నిన్న మొన్నటి వ్రాతలు ప్రకాశకులవి. వానివలన కావ్యమునకు నూతన గౌరవము వచ్చుననుకొనుట పొరపాటు.

అసలు కవి యావేశపరుడు కావలయును. వశ్యవాక్కు కావలయును. విశ్వహృదయుడు కావలయును. ఆవేశమును క్రియారూపమున ప్రతిబింబింపఁగల యభ్యాసపరుడు కావలెను. ఇవి యన్నియు కవి ఆవేశపూర్వక ప్రతిభాయుతుఁడైన వానియందుఁ దమంతట తామే కలుగును. శ్రీ డాక్టరు సాంబమూర్తి గారట్టి కవి.

చింప నవసరములేదు. అధికారులనిన భయములేదు. ఆవేశము ఆవేదముకలిగిన యథార్థమైన భావమునకు వాగ్రూపమీయ వలసినదే.

వీరికికూడ నట్టిమార్గమే. వేమన ఆటవెలదుల నాశ్రయించినాడు. వీరు తేటగీతుల నాశ్రయించినారు. 'ఆట వెలదుల' సొబగుల తేటగీతుల పరగించినారు.

ఈ కవి తథ్యవాదియు, పథ్యవాదియు, మిథ్యావాది కాడు. లోకుల మెరమెచ్చులకు ప్రియములే పల్కువాడుకాడు.

సంఘమును విమర్శించెనా 'వ్రణముల' నాపరేషను చేయునప్పటి నిర్దాక్షిణ్యత రావలసినదే.

ఒక బడుగుదేహమువాడు, దౌర్భాగ్యుడు, బీదవాడు — వానిని గూర్చి

"వాడిపోయెను వాని నేత్రాలనుండి
కాంతులన్నవి స్వార్థలోకాలపైన
అతనిజీవిత సౌందర్యమందు - శోభ
యన్న దేవంక లవలేశ మెన్న లేదు. (1-12)

"మానవులె నాగుబాములై మానవులనె
కాటువేయగలారంచు గాంచు నెవడు? (1-14)

కృతకశబ్దాడంబరము కవికి పనికిరాదు. అచ్చమైన జాతీయము కావలయును. ఆ జాతీయము హృదయమందలి బాధతోగూడిన భావమును వ్యక్తము చేయజాలునట్టిదై యుండవలెను.

# ఉపోద్ఘాతము

'విశ్వగీత' యను నీ పద్యకావ్యమును వ్రాసినవారు శ్రీయుతులు డాక్టరు పొందూరి సాంబమూర్తిగారు.

నిజమైన కవిత్వమును రుచిచూపి 'రైతుబాబు' ను బ్రచురించి యాంధ్రుల కింతకుఁ బూర్వము వీరు పరిచితు లైనవారే.

కొన్ని కావ్యముల కుపోద్ఘాతము లవసరము లేదు. కొన్నింటికి కుపోద్ఘాతము లెంత విపులముగా నున్నను బ్రయోజనము లేదు. ఈ కావ్యము మొదటి జాతికిఁ జెందినది.

భారతముపై నెవరి యభిప్రాయమున్నది? భాగవతముపై నెవ్వరి తొలిపలుకు లున్నవి? నిన్న మొన్నటి వ్రాఁతలు ప్రకాశకులవి. వానివలన కావ్యమునకు నూతన గౌరవము వచ్చుననుకొనుట పొరపాటు.

అసలు కవి యావేశపరుఁడు కావలయును. వశ్యవాక్కు కావలయును. విశ్వహృదయుఁడు కావలయును. ఆవేశమును క్రియారూపమున ప్రతిబింబింపఁగల యభ్యాసపరుఁడు కావలెను. ఇవి యన్నియు కవి ఆవేశపూర్వక ప్రతిభాయుతుఁడైన వానియందుఁ దమంతట తామే కలుగును. శ్రీ డాక్టరు సాంబమూర్తి గారట్టి కవి.

చింప నవసరములేదు. అధికారులనిన భయములేదు. ఆవేశము ఆవేదముకలిగిన యథార్థమైన భావమునకు వాఙ్మూర్తి యీయ వలసినదే.

వీరికికూడ నట్టిమార్గమే. వేమన ఆటవెలదుల నాశ్రయించినాడు. వీరు తేటగీతుల నాశ్రయించినారు. 'ఆట వెలదుల' సొబగుల తేటగీతుల పరగించినారు.

ఈ కవి తథ్యవాదియు, పథ్యవాదియు, మిథ్యావాది కాడు. లోకుల మెరమెచ్చులకు ప్రియములే పల్కువాడుకాడు.

సంఘమును విమర్శించెనా 'వ్రణముల' నాపరేషను-చేయునప్పటి నిర్దాక్షిణ్యత రావలసినదే.

ఒక బడుగుదేహమువాఁడు, దౌర్భాగ్యుఁడు, బీదవాఁడు — వానిని చూచి

"వాలిపోయెను వాని నేత్రాలనుండి
కాంతులన్నవి స్వార్థలోకాలపైన
అతనిజీవిత సౌందర్యమందు - శోభ
యన్న దేవంక లవలేశ మెన్న లేదు. (1-12)

"మానవులె నాగుబాములై మానవులనె
కాటువేయగలారంచు గాంచు నెవడు? (1-14)

కృతకశబ్దాడంబరము కవికి పనికిరాదు. అచ్చమైన జాతీయము కావలయును. ఆ జాతీయము హృదయమందలి బాధతోగూడిన భావమును వ్యక్తము చేయజాలునట్టిదై యుండవలెను.

"అందమున డాగి దైన్యంబు ముందునిల్వ
నాతఁ డుక్కిరి బిక్కిరై యలమటించె. (1-18)

"కలము చేఁబట్టి రాజ్యచక్రమ్ము ద్రిప్ప
నేర్పు గలవార లోకనాఁడు నిలువ నీడ
లేక భిక్షాటనమ్మునకై ప్రాకులాడు
దురు దివారాత్రములు నీడ తోడు లేక. (1-30)

ఈ జాతీయ కల్పనము ముచ్చటదైనది.

"గుండె గడియారమాగిన కూలిపోవు
... ... ... ... ... ...
... ... ... ... ... ...
... ... ... ... లోటురాదు. (1-33)

"ధరణిపై పేదవాని యాదర్శమెపుడు
పండుటాకువలెన్ క్రిందు పడి నశించు. (1-34)

ఎంతటి సూటిదైన యుపమానము !!

కవికి నేటి సంఘ మిట్లు గోచరించి బాధ పెట్టినది.

'సుడుల దిరిగిన కోర్కెల బడు నొకండు
కడుపుమంటల నిరాశ గుడుచు నొకడు
ఉడుకుమోతున నొక్కండు నోడలు మరచు
బడుగు దేహార్తి దిక్కులే కడలు నొకడు.

పదములకొఱకు కవి వెదకులాడడు. లోన జనించిన భావము సహజములైన నుడిలో నొదిగి సహజముగాఁ దనంతట తానే మూసలో నొదిగిపోవును. ఇదియొక గొప్ప కవిప్రజ్ఞ. జాతీయతాభావము, దేశభక్తి ఎందుచూచినను వెల్లివిరియును.

చూడుడు (2-31)

ఈ కవి సందేశము ఎంతటి యనుభవసారమో ?— ఎంతటి బాధాజనితమో గ్రహింపుఁడు.

"హృదయమను పీఠభూమిలో - బదనుగల్గు
సత్యమను హలముతో దున్ని సాగుచేసి -
కరుణయను పంట పండించి - గాదులందు
బట్టనేగుదమా ! సఖా ! పర్వాలెత్తి. (2-39)

ఎంతటి యౌదార్యము !!

ఈ రోజులలో వ్యక్తుల జీవిత సార మిదియట—

"పగలుపని, రాత్రినిద్దుర - బద్ధకమ్ము
... ... ... ... ... ...
... ... ... ... ... ...
జీవితములోని ప్రకృత సిద్ధగుణము. (3-10)

మూఁడవ ఖండములోఁ గవి ప్రత్యక్షముగా సంఘ విమర్శనమునకు దిగినాఁడు. ఆతని యావేశమున కడ్డులేదు. అది కొండయేరు. ఆపిన నాగదు. ఆ వేగము, ఆ వేగమూఁదానిదే.

తానుండు సంఘము - మానవ సంఘమా ! మానవ ప్రాణములు పీల్చుకొని తిను నిశాచర సంఘమా ! యని

-యతనికి ప్రశ్న వచ్చినది - తనసోదరుల విమర్శించి వారి హృదయములయందు సద్భావ లనముల సంకురింపఁ జేయుచే నాతని ప్రయత్నము.

మండు వేసవి యెండల మరిగి మరిగి
భూమి బీటలు వారిన పోల్కె నదిగో !
ఎండిపోయిన కాంక్షల గుండెలోన
మండి తెగమండి కండ్లలో మరుగుచుండె

బాధితుల హృదయముల పరీక్ష చేయగల యీ వైద్యునకు హృదయభావముల పరిణామమును గూడ వివరింపగల యీ వివేక మెన్ని జన్మల సంచితమో ?

విశ్వమన్న వేసారినాఁడు. శాంతికిని నీ విశ్వమునకు చాలదూరమని గ్రహించినాఁడు. ఇక తుదినిశ్చయమునకు వచ్చినాఁడు.

‘ రమ్ము పోవు చనంతవిశ్వమ్మునుండె
వెతలలోనున్న గుండెలు బ్రతికి బ్రతికి
శాంతి సౌఖ్యమ్ము లెటనుండి సాగునటకు ”

ఇది యావేశజనిత భావోద్రేకము. ఇందుండే కాలము నందలి రుగ్మత నెఱింగి మందీయజాలిన యీ సంఘవైద్యున కింతటి నిరాశ యేలగల్గెనో !

కావ్య మాద్యంతము మనోహరముగా నున్నది. సరస ముగా నున్నది. సహజముగా నున్నది. ఎరువు తెచ్చుకొన్నది

కాక హృదయబాధారూప ప్రతిబింబమై యుండి, స్వసంఘమును, స్వజనుల దురాచారముల నిశితముగా ఖండించి యుపదేశపూర్వ కాదేశమొసంగ తుల్యమయినది.

శబ్దప్రయోగమును గూర్చి యింతకుముందే వ్రాసితిని. ఒండు రెండపశబ్దములుండినను భావగ్రహణమునకు భంగకరములు కావు. ఈ దోషము లెప్పుడైననూ సరిదిద్దుకోవచ్చును. లేకపోయిననూ నష్టములేదు. కాని, యిట్టి కవితకు ఆటంకము కలుగరాదు.

ఇట్టి ప్రేమ నాయందు జూపిన వీరికి నా యాశీస్సులు. 'విశ్వశ్రేయః కావ్య' మన్నది వీరియందు దూఢమయినది. ఇట్టివి వీరెన్నింటినో వ్రాసి లోకహితంకరు లగుదురుగాక !

ఇట్లు,

విశాఖపట్టణం,
తే 2–3–58 దీ.

విద్వాన్, దివాకర్ల రామమూర్తి, ఎం.ఏ.
ప్రధానాంధ్రభాషోపన్యాసకులు,
ఏ. వి. యన్. కాలేజి, ఆంధ్రయూనివర్సిటీ.



# అంకితము

## స్వర్గీయులైన నా జననీ జనకులకు

(కీ॥ శే॥ చంద్రయ్య, వెంకాయమ్మలకు)

నన్ను గన్నట్టి తల్లికి నతులొనర్చి
నన్ను ప్రేముడి బెంచిన నాయనమ్మ
కెలమి బ్రణమిల్లి - ధరణిలో కలుములంది
బ్రతుక నేర్పిన తండ్రికే బ్రణతు లిత్తు.

వట్టికల్పనగాక సుభాషితంపు
మర్మమెఱిగిన కవితాకుమారి సుందు -
కావ్యమిదిగాదు నా గుండెకాయ కాని
ప్రాజ్ఞు లాదరింతురు గుణభావకలన.

నన్నుగని పెంచి భావసంపన్ను జేసి
జనుల మన్నన లందగా మనుగడ నిడి
స్వర్గమరిగిన పితరుల స్మరణకొరకు
అంకితమ్మొత్తు దీని నే నమితభక్తి.

— రచయిత.

# విశ్వగీత

## ప్రథమ ఖండము

1. ప్రాగ్దిశాభాగమున స్వర్ణప్రభల వెల్గు
బాలభానుని కిరణసంపద వెలుంగు
పటకుటీరముల సౌధ ప్రాంగణముల
వింత వింతల రంగులు సంతరించి.

2. చెట్లపై నున్న పక్షులు చెదరిపోయె
తమకువలయు పదార్థముల్ దడుముకొనగ
నాలమందలు మేతల కరుగుచుండె
కర్షకావళి పొలములు గాంచ నేగె.

3. గుంపుగుంపుగ విద్యార్థు లింపుమీర
సాగిపోయిరి తమ పాఠశాలలకును
చింతలో తలనమ్మిన జీతగాండ్రు
కడుపుమంటల 'నాఫీసు' గడప లెక్కె.

4. వీధివీధుల గుప్పెడు బిచ్చమెత్త
వట్టిజోలెల భిక్షుక వ్రజముసాగె
మంచముల్ నేయ గుమ్మగుమ్మాన జేరి
ముదుక డొక్కండు వేసారి మూల్గుచుండె.

5. దినదినంబున వస్తుల వనటగుంది
కాలిపోయెడి కడుపులు గమ్యపరచి —
ఆశకై యత్రుల న్బాసి యలమటిల్లి —
అరరె! దౌర్భాగ్యులెందరో సంతరించె.

6. కటికిగంజిచే - కాలెడు కడుపునింత
నింపుకొని - చేతగొడ్డలి నెత్తిపట్టి
చాలిచాలని చింకిలి పేలికలను
ప్రీతిమైదాల్చి - అడవికి వెడలె నొకండు.

7. కట్టెలగ్గొట్టి నెత్తిపై బెట్టుకున్న
'ముట్టె' యే లేనిచో - వాని మూతిమీద
గంజియేలేదు - అతని కండలెల్ల
క్రాగితేగాని లోకాలు కదలవేమొ ?

8. వానితనువున స్వేద ప్రవాహపూర్ణ
సింధుజలములు వరదలై చిందకుండ
సస్యసంపదచే భూమి సాగదేమొ ?
అతని నైర్మల్యజీవితం బంతెయేమొ ?

9. అతని బడుగుశరీరమం దదరిపడుచు
కాలచక్రమ్ము త్వరత్వరన్ గదలునేమొ ?
న్యాయబద్ధ సహానుభూత్యాదరములు
కత్తిగట్టినో వానిపై కరుణమాని.

10. అతని జీవిత యాత్రియం దంతరించె
నిరువదై దేండ్లు - అతని వరుసజూడ
నలుబదేండ్లుగ చూపులో నిలచియుండు
నిత్యపీడిత మానవానీకమందు.

11. వ్రాలిపోయెను వాని నేత్రాలనుండి
కాంతులన్నవి స్వార్థ లోకాలపైన -
అతనిజీవిత సౌందర్యమందు - శోభ
యన్నదే వంకలవలేశ మెన్నలేదు.

12. అతని మోమున దోబూచులాడు - భావ
పుంజముల్ స్వార్థబడబాగ్ని బూదియయ్యె
అతడొక మానవాకార మంది భువిని
బ్రతుకుచుండెను జీవచ్ఛవమ్ము వోలె.

13. అతని కడగంటిచూపులో వెతలపుట్ట
పెరుగుచున్నదటం చెవ్వ రరయగలరు ?
మానవులె నాగుబాములై మానవులనె
కాటు వేయగలారంచు గాంచునెవరు?

14. అతని హృదయంపు గోళమం దగ్గిమంట
ప్రజ్వరిల్లంగ జేసిన పాపులెవరు ? —
అతనిజీవిత సర్వస్వ మపహరించి
యినుప పాదాలతో ద్రొక్కు మనుజులెవరు ?

25. భద్రమెఱుఁగని చింతాసముద్రమందు
జీవితపునౌకపై దరిఁ జేరలేక
విపినభూములలోఁ బడి – వెతుకఁగోరి
తే మహోత్తర శాంతి సందేశములను !

26. ఈ విశాల ప్రపంచమం దీవు నేను
నేకమై కన్నుమూసిన నెవ్వఁడెఱుఁగు
స్వార్థలోకాలలో విషజ్వాల లడరి
శాంతి సౌఖ్యమ్ము ధన నివాసమ్ము సలుపు.

27. ఇది మహోత్తరలోకంపు కదలిపాటు –
ఇది చరిత్రవిచిత్రత కెదురుపాటు –
ఇది నివాసప్రవాసంపు ప్రిదిలిపాటు –
ఇది వగలుపొంగులపారు నదులవాటు.

28. అరయ జీవితమన్న చో నంతెసుమ్ము –
బ్రతికి చెడువారు, చెడిపోయి బ్రతికి పెద్ద
గణ్యతన్బొంది రాజ్యచక్రమ్ము ద్రిప్ప –
ఓడలో బండ్లు – బండ్లలో నోడ లరుగు.

29. కలము చేబట్టి రాజ్యచక్రమ్ము ద్రిప్పు
వేర్పుగలవార లొకనాడు నిలువనీడ
లేక భిక్షాటనమ్ముకై ప్రాకులాడు
దురు దివారాత్రములు నీడతోడు లేక.

30. జీవితగతానుభవములే చిలికి చిలికి
ప్రళయగర్జితవాతమై బర్వులెత్తు
జీవితచరిత్రలో నతిచిత్రమైన
" స్వానుభవమను " దేశసంచారి దోచు.

31. అరయ సంసారసాగరమందు మనకు
క్రోధము, జుగుప్స - ఈర్ష్య, విరోధములకు
స్థావరంబైన సంక్షుబ్ధ సలిలమబ్బు -
లేదు సత్యమ్ము వెదకిన న్మేదినిపయి.

32. గుండెగడియార మాగిన కూలిపోవు
నే క్షణాననో—యీ దేహ మిచట నొదిగి—
మట్టిలో మట్టిగామారి మరుగుపడును
నాఁటితో మన మమతే కేలోటుఁరాదు.

33. మనసులోపలి భావాలు మమతపోల
మాసిపోవును లోలోన మాఁటుమణిగి —
ధరణిపై పేదవాని యాదర్శమెపుడు
పండుటాకువలెఁ గ్రిందఁబడి నశించు.

34. నీవు నేనును – ఈ ప్రజానీకమందు
నున్నవారమటం చెవ్వరెన్నబోరు –
ధన పరీవృతమైన యీ ధరణియందు
నంటుడొక్కలగోడెవ్వఁ డరయువాఁడు.

35. భోగలాలసు లిండ్లలోపున వసించు
కుక్కబ్రతుకులె మనకంటె గొప్పసుమ్ము -
మానవులలోన మానవమాత్రులమయి
బ్రతుకుచుంటిమి జీవచ్ఛవాల పోల్కి.

36. కుడుచుచుంటిమొ ? బాధతో కుములుచుంటి
మో యెరుంగదు లోకమ్ము - ఓర్వలేని
దనుజ మానవ సంఘమ్ము దరినినిల్చి -
హృదయములువిప్పి మాటాడ నదనులేదు.

37. నీవు నేనును నేకమై - పోవు వేళ
కదలి వచ్చెడు 'కాలచక్రాల' క్రింద
నలిగిపోయినచో - జూచు నలికిపాటు
లేనిదై స్వార్థభోగపుసాని నిలచి.

38. చెట్టుతొఱ్ఱల కొమ్మల చివరలందు
దట్టముగనుండు కంపల తోట్టెలందు
నుట్టిపడి చిద్విలాసాన నొప్పియున్న
పక్షులే మనకంటె భవ్యత వసించు.

39. లేంతజిగురాకుతోపుల లోతు లరసి
పిల్లగాడ్పుల సౌఖ్యమ్ము లెల్ల నెరిఁగి
ఫలరసమ్ముల హృదయనాడులు కదల్చి
పర్వులెత్తెడు పులుఁగుదంపతుల గనుము.

40. జలజలారాల గుట్టల జారిపారు
చిన్న సెలయేళ్ల దూకుఁడు చిలిపితనము –
జిలుగుజిలుగుల రంగు పచ్చికబయళ్లు
గూర్చునార్భాట మొకవింత గొల్పునదిగా !

41. కన్నువిప్పని పసికూనగముల, ఱెక్క-
సందులం దదిమి పూర్ణవాత్సల్య మొల్క-
చిద్విలాసంబుతో చీకుచింత లేక
పరగుపక్షులు నేత్రపర్వంబు గూర్చు.

42. పొదలలోనుండి జరజర బోవుచున్న
కొండచిల్వల గనుగొమ్ము – కొరవిదెయ్య-
ముల విషమ్మున గ్రుడ్లెల్లకిలను బెట్టి
భయముగొల్పెడి గుడ్లగూబలను చూడు.

43. అదురుబెదురు నెరుంగని కుదురుతోడ
తల్లికడుపుల నంటెడు పిల్లకోతి
మూకలల్లవె ? – చూచితే మోరలెత్తి
పారిపోయెడు లేళ్లవే బయలుమీఁద.

44. ధరణిపై నుండు జీవసంతానమంత
బ్రతుకుచున్నది వెతలేని గతులగల్గి –
బితుకుబితుకున మమతల గతుకులందు
మానవునిగుండె గాయమే మానలేదు.

45. సర్వమానవ సౌజన్య మున్వేమి
గర్వమను తీవ్రతిమిరమ్ము గనులఁ గప్ప
మానవుల మానుషమ్ములో మసలజొచ్చె
పారమార్థిక చింతన భావ ముడిగి.

46. కఠినరాక్షసజనుల సంఘాన నిల్చి
నిత్య సత్యస్వరూపంపు నీడలందు -
ఒకనిమేషమ్ము నిశ్చింత నుండలేము
సకలపాపౌఘ సంసారసాగరమున.

47. గుట్టెరుంగని జానెడు పొట్టకొరకు
బడెడుపాట్లెగదా! యివి - బాముకొంచు
జీవిత ప్రయాణమ్ములో జివరదశను
కదలిరాబోదు మనవెంట గడ్డిపరక.

48. జీవిత విచిత్రయాత్రలోఁ జేరినట్టి
బాటసారికి - సుఖదుఃఖ భావయుక్త
ఘట్టములలోన వెలుగింత కానరాదు
తనపురోగతి కేవంక తడవిచూడ.

49. వానిధనమంత - నాకింతవరకు లేదు
పృథ్విలోనంచు మనసున జెంగగొనుట
'పుట్టు' టన్నది తిరిగిపోబోవుట నెడు
శుద్ధ మర్మమెరుంగని సూక్తిసుమ్ము.

50. 'సత్యహింసల' దరినిల్పి - నృత్యవిధము
తెరిగి జీవించుటేగద యేర్పడైన
ముక్తిమార్గమ్ము - సద్ధర్మ యుక్తులెరిగి
రక్తి జెడువర్గమన్నదే రాక్షసులన.

51. అదిగో! భగవానుసృష్టిలో సందమైన
ప్రకృతిచిత్రింబు లెన్నియో ప్రభలనెల్లు —
ఆతడిచ్చిన పుట్టువు లందుకున్న
మానవులు పెక్కుతీరుల మసలుచుండ్రి.

52. సుడులదిరిగిన కోర్కెలం బడు నొకండు
కడుపుమంటల నిరాశ గుడుచు నొకండు
నుడుకుమోతున నొక్కండు నొడలుమరచు
బడుగుదేహార్తి దిక్కులే కడలునొకండు.

53. పాటిసోదరు డార్తి చేజాచినయెడ
ఖేదమొందరు జనము లొకింతయైన
తాగుడుకు వినోదాల కెంతైనఁగాని
ఖర్చువెట్టెద రెల్లెల్ల కడకు నమ్మ.

54. రమ్మ! ఈ నిర్జనారణ్యరథము నెక్కి
కదలిపోద మనంతయాకాశమందు
వెతలతోనున్న గుండెలు పితికిపితికి
శాంతిసౌఖ్యమ్ము లెటపొంది సాగునటకు.

# విశ్వగీత

## ద్వితీయ ఖండము

1. యువక ! యిల్లదె నిర్జనాటవులలోన
పశులఁగొల్పెడి జీవిత మాయలోన
కాలమును నెట్టు వన్యమృగాలఁ బట్టి
పశువులం జీల్చు క్రూరమానవుల గనుము.

2. గాలినే పిల్చి ప్రకృతి గానములకుఁ
బులకితములౌచు విచ్చిన పూవుబోండ్ల
సున్నితములైన గుండెల సూదిఁగ్రుచ్చి
కలుకుచున్నట్టి వెలయాండ్రకులము గనుము.

3. మట్టిఁ దిని మట్టిలోపల మసలి మసలి
గాలికోసము నీటిపైఁ దేలియాడు
గండుమీనమ్ముల న్బట్టి ' గాలములను "
వలలఁ బన్నిరి యమకింకరుల విధాన.

4. వేటనెపమూనుచును వ్రేటువెట్టి - కడకు
మానవునిగుండెలే బెండుమాడ్కి వాడి
' గుండు ' తోఁ గొట్టి - నెత్తురు కురియుచుండ
స్నానమాడెదు మానవ సాహసమదె !

5. బయటనేయుండి స్వేచ్ఛగాఁ బ్రతుకుచున్న
యురగసంతతులన్బట్టి యొడలుఁ జీల్చి
వానిచర్మంబునే "బూట్లు" పయి నమర్చి
గొప్పగా నీటుచూపించు గోడెయతఁడె.

6. గ్రుడ్డుపొదిగించి పిల్లగఁగూర్చి తుదకు
పెంచి పెద్దదిగాఁజేసి — పీకఁబిసికి
వేయునొకనాఁడు నీచుడై వెడగునరుడు —
ఏల తనబాధనింతె యూహింపలేఁడొ !

7. జంటతోయున్న పక్షినిఁ జంపునపుడు
పలువిధమ్ముల రెండవ పక్షిపడెడు
రోదనస్వన మెవ్వండు రూఢిదరచుఁ
బక్షిదొరకిన సంతోష పడుటఁదక్క.

8. బలులనీయంగ గొఱ్ఱెలఁ బట్టిపోవు
వట్టిమూర్ఖుడు వానిభావమ్ముఁ గనునె?
వానిమెడపైన కత్తినివ్వాటిలువేళ —
అనివెలార్చెడు దుఃఖమ్ము నరయగలడె ?.

9. ఎండవేడికి పాదాలు మండిపోవ
చెట్టునీడకుఁ బర్వెత్తి జేరినిలచి
విశ్రమించిన గొండొక వేళకతడు
దానినే ద్రుంపనెంచు స్వార్థమ్ము పొంటె.

10. ఆవుపాలను కడుపారఁ ద్రావిత్రావి
వానిసంతతితో కృషీవలుఁడు నోచు —
దానిచర్మంబె చెప్పులుగా నమర్చి
కండలందిను విశ్వాసఘాతకుండు.

11. వావివరుసల విడనాడి - వాడవాడ
లందు గ్రిమ్మరుచుందురు లంపటముల —
తమదు స్వార్థమ్ముకోసమై వెనుకఁ దడరు
పాదమన్నది పరులను బట్టిజంప.

12. మధిరమత్తత, తలకెక్కి మతులువాయ
భార్యనే దెచ్చి పరులకుఁ బట్టనిచ్చు —
తనకు నుపకారలేశమ్ము దార్చునెడల
నెట్టి దుర్మార్గములనైన నిట్టెఁజేయు.

13. సస్యముల శ్యామలమ్మయి సాగుచున్న
యీ విశాల ప్రపంచమం దీర్ష్యతోడ
బ్రతుకనెంచిన మానవ బ్రతుకులన్న
సిగ్గుగల్గదె! మానవ జీవితమున.

14. బుద్ధు డుద్భవమొందిన భూములందె
సత్యమార్గమ్ము కనుమాసి సాగె నదిగో ?—
అలమహాత్ముఁడు గాంధిజీ! వెలసినట్టి
భరతదేశమ్మునందునా బలులుఁగనుట?.

15. మానవులె మానవునిఁగోడు మాన్పలేక
మసలుచున్నారలా నేఁడు మలినమతుల —
తల్లులే పిల్లలన్స్త్రీగఁ దలపఁడు నెడ
నష్టకొనువార లెవ్వరో యవనియందు.

16. తీర్చిదిద్దినయట్లు నదిమతల్లు
లెల్లెడలఁ బారు దేశమా! యిది తలంప
కనకరత్నమయ ప్రదీప్తిని వెలుంగు
భారతక్షోణియా! ఇది బాగు! బాగు!

17. గనులలోపల - పనులలో కనులఁ గప్పి
చాకిరీలందు మానవజాతిఁగన్న
దేశమా! యిది ? — మనద ! ? — మా దేశసేవ ?
దేశమా! దేశభాగ్య మేదెసకుఁ బోయె ?.

18. కనులఁ మెఱసెడు పాలరాలను కుదించి
యుగయుగాలకు మానికమ్మగు విధాన
కొన్నికోట్ల ధనమ్మునే కొల్లఁగొన్న
హాయినిడు ! - శిల్పి — టాజుమహల్ల దేవ ?.

19. దివ్యపథమున గంగానదీమతల్లి
కౌగిలింతల — వింతల - గల్గియున్న
కాశియందలి విశ్వనాథేశు పొంత
నున్నఘట్టమ్ము లాయవి యుల్లమలర ?

20. అన్నపూర్ణాంబికావాస మరయ నదియ ?
సత్యనిష్ఠా హరిశ్చంద్ర సార్వభౌముఁ
డేలిన శ్మశానభూములా ! - ఇవి తలంప ?
దలఁచినంతనె గుండెలు దద్దరిల్లు.

21. అదిగో ! అమరావతీస్థూప మదరు వేళఁ
జచ్చిపోయిన గుండెల స్వాగతములు –
అల యజంతాగృహద్వారమందు నిల్చి
చిత్రసౌందర్యమెంచినఁ జెదరుఁ గనులు.

22. సిద్ధనాగార్జునస్వామి శిథిలములవె !
చూడఁజూడఁగ - గుండెలే యూడిపోవు
సారనాథుని దివ్య సంస్మరణ మెన్న
గతచరిత్ర విచిత్రమై కనులఁదోచు.

23. నవ్యశోభలనెల్లు రత్నాలమేడ
లందు నుండిరా వారంత ? – అచటఁ గ్రింద
కటికరాళ్లను బండచీకటుల లోనఁ –
బవ్వళించిన వారె వెవ్వారో గనుము ?.

24. ‘ శాంతి ’ యన్నది కనుచూపు చాయలందుఁ
గానరాదేమి ? - ప్రతియొక్క వానియెడద
తెలమి ప్రవహించుచున్న నిస్పృహ లవేమి?
లోకమే నేడు - అల్లకల్లోల మయ్యె.

25. జంతువులఁబట్టి హింసింప సాగినట్టుల
మానవుఁడె - మానవునిఁబట్టి మాపుచుండె-
అణుయుగమ్మిది - అనుదినమ్ము పహసించి
మృత్యువయి మానవునిఁబట్టి మీరి చెలగు.

26. మానవుని జీవిత పథమ్ములోన నిల్చి
జాగరితం జూపలేని విజ్ఞానమేల ? -
ఆధునాతన పద్ధతు లరయుటన్న
పూర్తి లోకమ్మునే భంగపుచ్చుటేమి ?.

27. వీరబొబ్బిలికోటపై వెలసినట్టి
వెల్మవీరుల శౌర్యంపు వెల్లులందు
తాండ్రపాపయ్యదా 'తళ తళల' బాకు
గాంచినాడవో ? - హృదయమ్ము గంపమెత్త.

28. కనుము పల్నాటివీరు లాకాశమంత
పొరలపొంగించి నెత్తురు బురదతోడ
కావిరంగులుదిద్దిన కాంతిరేఖ
కనులు మిరుమిట్లుగొల్పఁగఁ గానబడెడు.

29. కదనరంగమ్ములో జిల్కి కదలినట్టి
రక్తమే యేరులై పార - రథము డిగ్గి
శుద్ధమగు నాత్మతోడ నశోకుడిడిన -
అల యహింసావ్రతజ్యోతి యదియె గనుము.

30. కనుము కాటమరాయ డాగ్రహమ్ముతోడ
వైరివీరుల జెవ్రులు బట్టిచెండి
వీరస్వర్గంబులో నెట్లు వెల్గుచుండె
రోషరోమాస నాంధ్రపౌరుషముతోడ.

31. కాకలందిన వైరి ప్రకాండమందు
భద్రకాళీస్వరూప ప్రభావ మంది
విలయతాండవమూర్తియై వెలిగెనదిగో?
రాణి రుద్రమదేవి పోరాడె జూడ.

32. నదుపులేకుండఁ బారుచున్నయవి – అవిగో
గౌతమీ! కృష్ణ! కావేరి! గాంగ! యమున
అల త్రివేణీ! పినాకినీ! – అదియొ పెన్న!
వంశధారయు! లాంగుళ్య! – వరుస నవిగో?

33. ఎన్నగా దేవళమ్ము లెన్నెన్ని గలవో? –
పరమపావనమైన యీ భారతమున
బుద్ధభగవాను డరిగిన భూములవిగో? –
చెప్ప లేమవి జగత్ప్రసిద్ధములగు.

34. 'రాయలు' వరాలమూటలు రాల్చినట్టి
ఆంధ్రదేశాన అన్నార్తులరరె! చూడు :–
కాకతీయులు శౌర్యమ్ముఁ గ్రక్కుచోట
పిరికిపందలు బుట్టిరల్లరుగా! కనుము!

35. వేదములునాల్గు వ్రాసిన - బాదరాయ
ణుండతడేను - వాల్మీకి, దండి - కాళి
దాసు - భవభూతి - భారవి దర్శనములు
దొరకుచున్నవి యిచ్చటే తిరిగి జూడు.

36. రాళ్ళఁగరిగించు సంగీతరాగసుధల
భారతావనిఁ నెల్లెడఁ బారఁజేసి
దివ్యపథా స్వర్గపీఠిపై దీర్చియున్న
త్యాగరాయలు వారదే! యోగి గనుము.

37. ధాత్రినుద్ధరింపగ నవతారమూని
శంకరాచార్య - రామానుజాదిఁ గాఁగ
మతగురువు లెందరెందరో వితతమతులు
చాటిచెప్పిరి శాంతి దర్శనము లెన్నొ!.

38. హృదయమను క్షేత్రభూమిలో - పదనుగల్గు
సత్యమను హాలముతో దున్ని - సాగుఁజేసి
కరుణయను పంటఁ బండించి - గాదులందు
బట్టనేగుదమా! సఖా!! - బర్వులెత్తి.

39. నడుము _ అల్లదె పర్వదినమ్ముఁ జూడ
పెద్దపెద్దల యిండ్లలో వెలుగుచున్న
పసిడికాంతులతో నొప్పు భామలగమి
'హాయలు' బయలెట్లు గప్పుచు నొప్పినారొ!

40. ఆమె క్రీనీడలోనుండి యలమటించి
గుండెచెదరిన దుఃఖంపు కుదుపులందు
నాల్కతడిలేని యొక్క - అనాథయువతి
అడుగు తడబడ ముందుకుఁ బడియెఁ జూడు.

41. పుట్టిన క్షణంబునుండియుఁ గిట్టువరకు
శాంతిసౌఖ్యంబులన్నవి - స్వాంతమందు
నైన నూహింపలేని - అన్నార్తులరుగొ?
మర్మమెరుగని మమతల మసలుచుండె.

42. వర్గముల పోరులందున - నిర్గమించు
స్వార్థమానవులన్ మును సాగి గనుము
రాచకీయంపు క్లిష్ట సంరంభమందు
బూర్తిగాఁ గప్పబడిన ప్రబుద్ధుడతడె!

43. కులమతములను - మలినంపు గూడులందు
స్వార్థమను వేదికలపైనఁ జాగుచున్న
కవుల సన్మానము లవేను గాంచుమోయి?
గుండెపగులఁగ - కన్నులు మండిపోవ!



# విశ్వగీత

## తృతీయ ఖండము

1. తరుణి గనుఁగొంటె? - యీ విచిత్రమ్ము గొంత-
ఉన్నవారలు, లేనివా రున్నవాని-
కడుపు నింపుటకే చూతు 'గోడులు' నింపి
కడకు దైవమ్ము ధనికునికాళ్లఁ బట్టె.

2. కావ్యములలోనఁ గొన్ని సంగతుల జొనిపి
తెలివిమాలిన మనుజుల విలువ లెన్ని
నిలువునన్ బ్రాణములుఁదీయ నిలిపినట్టి
'శాసనాలను' భూతముల్ - సాగునవిగా!.

3. పట్టెడన్నంబుకోసమై ప్రాకులాడు
పేదవారల నొకకంట నాదలేక
ప్రాణములులేని చిల్లర రాళ్లకెల్ల
మొక్కుచున్నారు బంగారు మొహరు లిచ్చి.

4. 'కనుజు' బారిన రాచకీయములలోన
'చిల్లపెంకు' ల వలె 'నోట్లు' జల్లునట్టి
దేశనాయకు డొకసారి - యాసతోడ
కరముఁజాచిన దీనునిఁ గసరిదిట్టు.

5. ధనములోనున్న విలువలు తలంపలేక
దాని నపమార్గములలోన ధారవోయు -
అహారహమువచ్చు వారల యవసరములఁ
దీర్చ లేనట్టి 'దేశీయ' దీక్ష యేమి?

6. పరిసర ప్రాంతములలోనఁ బర్వలెత్తు
నిత్యపీడిత మానవాళిక బాధ
సరియొనర్పంగ లేనట్టి సాహసులడె
ముందుగా వేదికలపైన నుందురేమి ?.

7. వర్ణ వర్ణాంతరముల లోపముల నెంచు
నిష్ఠపరు లెందుచేతనో తిష్ట వేసి -
అలఘలాహార శాలలయందు ప్రొద్దు
పోమవకుండంగ నుందురే పాలుపుపలన ?

8. పరులకోసము నీతులు పలుకువారు
తమ ప్రవర్తనలోఁ దప్పుఁ దడవరేల ?-
గోటుగా సత్యవాక్యముల్ జాటువారె
పరుల 'కొంపల'ఁ బడగొట్టఁ బత్వువారు.

9. శాస్త్రమని, ధర్మమని - కొన్ని సాకులెత్తి
దారిలేనట్టి యోగ్యుల నోరుమూసి
తనకడుపు నింపుకొనుటకై దారిఁజూపు
నాతడా సంఘసంస్కర్త ? - అరసిచూడ.

10. పగలుపని - రాత్రినిద్దుర - బద్ధకమ్ము -
తినుట - తిరుగుట - నొకటికి - వెనుకముందు -
ఏడ్చుకొనుటయు - నవ్వుట - ఎగిరిపడుట
జీవితములోని ప్రకృతి సిద్ధగుణము.

11. ఎన్నిరోజులు 'కుట్రల' నేడ్చుకొన్న
పట్టెడన్నము కడుపుకై పడుచుకొనుకై -
యిందుగల యంతరార్థమ్ము నందునిజముఁ
జూచునాతఁడె పేదలఁ బోధించువాఁడు.

12. చూడు మోహప్రియ ! అచ్చోటఁ గూడియున్న
మానవులగుంపు ! - అచ్చటే మాటుమణిగె
కన్నుమూసిన దౌర్భాగ్య కాంతశవము -
వింతవంతల జీవిత మంతరించు.

13. ఆశతోనున్న కోరిక లంతరింప
కుమిలి, కడుపెల్ల అంపపుఁగోత కాఁగ
జీవితపు "యంత్ర" తంత్రాల భావమెఱిఁగి
మంత్రముగ్ధునిగాఁ జూచు మనుజఁ డిదుగో ?

14. జీవితముపై విరక్తినిఁ జేరఁదీసి
సాగిపోయెడు వెంగళి సాధువతఁడె ? -
జీవితసమస్య నొక్కింత జీల్చలేక
ప్రాణములుఁ బాయ నేగుదౌర్భాగ్యుఁడిడిగో !

15. సంఘమును భాగుజేయంగ సాగినట్టి
బుద్ధిమంతుడు దానితోఁ – బూదియయ్యె
పుట్టి బుట్టుట పోడమిన బుద్ధులవిగో ?
కాలపురుషుని రథముపై కదలుచుండె.

16. ఏమిటో ! యీ ప్రపంచ మందింత వింత
లంతులేకుండ భూగర్భమందు డాగె ?–
నారి కేళమ్ములో 'నీళ్ళు' జేరి తుదకు
నంతరించినగతి జీవు లంతరించు.

17. కదలికలులేని రాళ్ళను కదిపి చెక్కి–
సాగినిల్పిన పంచభక్ష్యములు జేరు –
కదలికలుగల్గు మానవు లెదలుకుమిలి
దాహమిమ్మన్న-చో లోకమే హాసించు.

13. రోజురోజన్న దాన సమాజమందు
పేదలకుమారు పెద్దింటి బిడ్డలెల్ల
కడుపులుబ్బగ పాయసాల్ గుడుతు రేల ?—
'కొట్టు, కొట్టు' న చందాలు కొల్లగొట్టి.

19. నీతినీతంచు పలుచోట్ల మాటివిరచి
చీకటిబజారులో 'డబ్బు' జేర్చుకొనెడు
చచ్చుదద్దమ్మలా ! లోక శాంతికొరకు
నెదిరిపోరాడ నేర్తురే ? – యీ ధరిత్రి.

20. చూడుమల్లదె పల్లెల శోభఁగొంత -
చారులందీర్చి సాగిన బసులు వెంట తేది....
బలిసిపర్వెత్తు లేగదూడల పసందు
కన్నులకు విందొనర్చుచు కానబడెడు.

21. అల్లదే! - అచటనచటనే యారుబైట
రత్నకంబళ్లవలె వింతరంగులొలుకు
పచ్చికబయళ్లఁ గనుఁగొమ్మ - వానియందు
మల్లములుపొంగ గెంతెడి పిల్లలరుగో ? -

22. తాటియాకుల పాకల చాటునొదిగి
మాసిపోయిన కోర్కెల మరకలందు
విశ్వమంతయు కండ్లతో వెతుకుచున్న
పల్లెజీవిత సాంస్కృతతల్లి యదిగో ?-

23. పొద్దుపొడచిన దాదిగా పొద్దుగ్రుంకు
వరకు చెమటోడ్చి కష్టించి పడినశ్రమకు
విశ్వ మాతనికిచ్చిన విలువఁజూడు-
పొట్టలో నల్లదే కాళ్లు బెట్టుకొనుచెం.

24. కాలవాహిని పరవళ్లు గ్రక్కుకొంచు
బడుగుజీవుల పైనుండి పారుచుండె
కాలపురుషుని రథముచక్రాలక్రింద
నలిగిపోయిన పేదల వలపులవిగో ?-

25. తనదు ప్రేమానురాగ సంతానమందు
బలిసిపోయిన రోగాల కులికిపడుచు
చిట్టిపాపను గుండెపై జేరవైచి
వైద్యమును బొందఁబోయెడు వనిత యదిగో ?

26. సర్వనాగరిక ప్రజా సత్రశాల
లైన - పట్టణ వైద్యాలయాన కుల్కు-
వింతమానవమృగముల సంతలోన
పాపమా ! పేదరాలితో పలుక రెవరు.

27. వలపులందించి చిరునవ్వు చిలుకరించి
పైటదిగజార్చి - గుండెభావమ్ముఁ జూపి
వలనుజిక్కిన విటులపై బ్రద్దలైన
కామినీక్రోధపర్వతాగ్రముల జూడు.

28. ఎగుడుదిగుడులులేని జీవేచ్ఛతోడ
పల్లెదంపతు లల్లదే పడెడు శ్రమము -
ఆకురాలిన కాలమం దలరినట్టి
చెట్టువలెనున్న జీవితగుట్టుఁ జూడు.

29. మండువేసవియెండల మరిగిమరిగి
భూమి బీటలువారిన పోల్కి నదిగో ?-
ఎండిపోయిన కాంక్షలు గుండెలోన
మండి తెగమండి కండ్లలో మరుగుచుండె.

30. ఉదయభానుడు తూర్పుకొండూచి బూచి
విశ్వనర్తకి శిగపైన వెలిగివెలిగి
పశ్చిమ సముద్రతిన్నెపైఁ బవ్వళించె
మసకచీకటి శాంతి సామ్రాజ్యమందు.

31. అతనికొక్కింత స్వాగతం బందజేయ
తారకలతోడ చంద్రుండు తారసిలియె -
చంద్రభగవాను డుదయించు సమయమందు
గాంగ నిర్మల సంగీత గాన మిడియె.

32. అల్లవే కొండలా కొండలందు సుడులు
దిరిగిబర్వెత్తు సెలయేళ్ల దెసకు చూడు -
ప్రకృతి తనయొక్క యౌవన భారమంత
మొలకఁబోసిన ముగ్ధరూపులనుఁ గనుము.

33. నిర్మల నదీజలమ్ముల మర్మమెరిగి
సాధుపుంగవుడొక్క డాశ్రమముఁ గట్ట
పులులు, జింకలు, తోడేళ్లు - ఎలుగుబంట్లు
నిలచి గనుగొమ్ము - ఒకచోట నీరుఁద్రాగ.

34. ఆదిగో! గంగాభవాని దిగంతములకు
'హోరు' మను శబ్దవీచుల మారుమ్రోగ
విశ్వశ్రేయోభిలాషియై వేయిగతుల
'శాంతి' సందేశములతోడ సాగిపోయె.

35. సకలమానవ కల్యాణ శాంతికొఱకు
మేఘమాలిక లల్లవే మెలగుచుండె —
గర్భధారణ వ్యథలతోఁ గదలలేని
నిండుగర్భిణి మేఘాలు నిలచె నవిగొ ?

36. కటికిచీకటి గాఢాంధకారమందు
కనులు మిరుమిట్లుగొల్పఁగ కానబడెడు
మెరుపుభోగపుసానిదా మరులు జూడు
మమతలో జీవితాశ 'తమాష' యౌను.

37. ఒకరికంటెను వేఱొక్క డొక్కసారి
గొప్పతనమును జూపింపఁ గూరుచుండె —
తాఁ జదివినట్టి చదువుల ఘనతలెల్ల
సర్వజీవ సమూహాల జంపుటయ్యె.

38. సుస్మితములైన గుండెలేఁ జూడఁజూడ
పండబారిన కోర్కెలోఁ బ్రద్దలయ్యె —
సహజకారుణ్య సంగీత సాగరములె
దుఃఖతప్తాగ్నిచే క్రాగి తొలగిపోయె.

39. వెతకి బుద్ధికి మేతను వేయఁబోవ
దొరుక దొక్కింతమట్టుగ దోషమేమొ ?—
సరిగ శాస్త్రంబులన్నియుఁ జదువఁజదువ
మదికిఁజిక్కదు దాని మర్మంబదేమొ ?

40. 'పంచశీలను' నొకమారు పఠనజేసి
వంచనాశీలమున దాని వదలివేయు -
యమకమునఁ దెల్పు నీతివాక్యమ్ము లెల్ల
బూదిలోఁబోయు పన్నీరుగాఁ దొలంగు.

41. దేవ ! దేవుడు - అల్లదేఁ దోవలోన
నిల్చియున్నాఁడు కనుగొమ్ము ! - నీకునాకు
దర్శనంబీయగలడేమొ ? — దరికిఁజేరి
వరముఁ గలదేని నిమ్మంచు పలికిరమ్ము.

42. సరి ! సరే ! ఆగు ! మాగుమో సఖియనీవు ! -
మనలఁ గనుఁగొంచు దేవుఁడే మాయమయ్యె
అదుగో ? - ధనికుల సౌధ, సౌధాంతరముల
మేనువాల్చెడి వాడెట్లు మెలఁగు నిచట ?-

43. 'లడ్డు' వడ్డీల 'జాంగీరు' లనుభవించు
చిద్విలాసికి మనమిచ్చు చింతపండు
'పచ్చడులు' నోటికింపౌచు బరగునొక్కొ ?-
కదళి, ఖర్జూర ఫలమ్ములఁ గాంచినట్లు.

44. స్వార్థపరమైన మానవజాతిలోన
మనికిగొన్నట్టి దేవదేవుని గురించి
తరచి దరచిన మనకేమి దొరుకఁబోదు
యుగయుగాల తపస్సులో మురకలిడిన.

45. పరిసరప్రాంతముల ప్రభావములనుండి
దేవదేవుడె మానవ భావములకు
కట్టఁబడియుండ మన కేమిగలదు సుఖము ?-
రమ్ము పోద మనంత — విశ్వమ్మునుండి
వెతలతో నున్న గుండెలు బితికి బితికి
శాంతిసౌఖ్యమ్ము లెటనుండి సాగునటకు.

సంపూర్ణము

మంగళం మహానిభవంతు.



శ్రీ సాయిబాబా పవర్ ప్రెస్, విజయనగరం.

ప్రతులకు :—

డాక్టరు, పి. సాంబమూర్తి

"మూర్తి కళా విహార్"

ఆమదాలవలస, ★ (శ్రీకాకుళం జిల్లా.)

.... ఆంధ్రప్రదేశ్ ....